శ్రీరస్తు.

శ్రీకృష్ణాయనమః.

# వైకుంఠశిఖరిణీపంచదశి

యను

# స్తవరాజము.

---

శ్రీమద్బొబ్బిలిసంస్థానస్థిత సంస్కృతపాఠశాలాపండితులగు

**న్యాపావఝ్ఝల సూర్యనారాయణశాస్త్రిచే**

రచియింపఁబడి

---

బొబ్బిలి హైస్కూలు సంస్కృతపండితులగు

మండపాకలక్ష్మీనారాయణశాస్త్రిచే వ్రాయఁబడిన

తెలుఁగుటీకాతాత్పర్యములతోఁ జేర్చి

---

తత్పురవాస్తవ్యులగు

మహారాజశ్రీ శ్రీ రావు వేంకట వేణుగోపాల పట్టాభి

రాయనింగారి ద్రవ్యసాహాయ్యమున

---

పిఠాపురమునందలి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1912.

శ్రీరస్తు.

శ్రీకృష్ణాయనమః.

# వైకుంఠశిఖరిణీపంచదశి

యను

# స్తవరాజము.

---

శ్రీమద్బొబ్బిలిసంస్థానస్థిత సంస్కృతపాఠశాలాపండితులగు

న్యాసావఝ్ఝల సూర్యనారాయణశాస్త్రిచే

రచియింపఁబడి

---

బొబ్బిలి హైస్కూలు సంస్కృతపండితులగు

మండపాకలక్ష్మీనారాయణశాస్త్రిచే వ్రాయఁబడిన

తెలుఁగుటీకాతాత్పర్యములతోఁ జేర్చి

---

తత్పురవాస్తవ్యులగు

మహారాజశ్రీ శ్రీ రావు వేంకట వేణుగోపాల పట్టాభి

రాయనింగారి ద్రవ్యసాహాయ్యమున

---

పిఠాపురమునందలి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

1912.

శ్రీరామాయనమః.

# ఉపోద్ఘాతము.

---

ఆర్యులారా! నేనప్పుడప్పుడు వినోదార్థమై శివపరంబులును, విష్ణుపరంబులునునగు గొన్నిశ్లోకములు జేసియుంటిని. ప్రసంగవశంబున నేనీశ్లోకముల జదివి యుపన్యసించుచుండ "రేచెర్లగోత్రోద్భవులును, రావుకులజలధి సుధాకరులును, దేవద్విజసమారాధనాసక్తమానసులును, ఆమేరుశీతనగమధ్యవర్తినిఖిలపుణ్యక్షేత్ర తీర్థపర్యటన పరిపూతులును, ఆశ్రితజనవత్సలురును, నిరుపమ మేధాయశోబలయుతులును నగు శ్రీవెంకయ్యప్రభువరేణ్యునికి ప్రభుమంత్రోత్సాహములవలె నుదయించిన బుచ్చివెంకటరావుగారు, వెంకటశోభనాద్రిసూర్యారావుగారు, వెంకటవేణుగోపాల పట్టాభిరామారావుగారు ననుమువ్వురిలో దృతీయులును పితృసమానయశోగుణులును ప్రభుసమ్మానితులునునగుగోపాలరాయనింగారత్యాదర

ముననాలించి, "విష్ణుపరంబగుశ్లోకంబులటీకాతా
త్పర్యములతోఁజేర్చి మీరివ్వవలెను అచ్చొత్తిం
చుటకు మిక్కిలియుత్సాహముగలద " ని నన్ను
బ్రేరేపింప కవనమంత రసవంతముగానుండకున్న
ను భగవద్విషయకంబగుటబట్టి చదువరులకు రు
చింపకపోదనినమ్మి విష్ణుపరమగునవి (పదునైదె)
శిఖరిణీవృత్తములోనున్నందున వైకుంఠశిఖరిణీ
పంచదశియని నామంబిడి తెలుగుటీకాతాత్పర్య
ములతోఁజేర్చి వారికిచ్చితిని. నాగ్రంథము శాశ్వ
తమగునటుల వ్యయప్రయాసములకోర్చి ముద్రిం
పించిన వమ్మవారుభావునికి కృతినాయకుండగు
భగవంతుడు నిరంతరము సకలాభీష్టములనొసం
గుగాక. మరియు నిందు సాధ్యమైనంతమట్టుకు
తప్పులులేకుండ సవరించితిని. మరియుఁ బట్టువ
డనితప్పులను సవరించుకొనుభారమును చదువరు
లయందేయుంచినందుకు క్షమింపవేడుచున్నాను.

ఇట్లుసుజనవిధేయుడు,

న్యాసావఝ్ఝల సూర్యనారాయణశాస్త్రి.

## ఇష్టదేవతాప్రార్థనా.



శ్లో. విఘ్నేశ్వరస్య కరుణారసపూర్ణదృష్టే
స్తస్యాంఘ్రియుగ్మమతులంశరణంభజామః
యస్యోత్కటప్రసవదుదారమదాఘుగాంగ
పూరేణశంభునమతాముదమాపగారీ॥

## గురుస్తవము.



యత్పాదాబ్జరజోనిరస్తతమసశ్శిష్యాదిగంతా
గతాః
కావ్యాలంకృతితర్కనాటకమహావేదాంత
విద్యాచణాః
గచ్ఛన్తీతిబుధావదన్తితమహాంభూపాగ్ర
గణ్యార్చితం
సీతారామమణీషిసద్గురువరంవందేకృపాసాగరమ్

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీకృష్ణ.

# శ్రీ వైకుంఠశిఖరిణీపంచదశి.



గదాంశంఖంచక్రంపరిమళయుతంపద్మమమలం
దధానోహస్తాబ్జైస్సకలసురరాజార్చితపదః
యఆసీద్భక్తానామతులఫలదానైకనిరతః
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే॥ 1

అర్థము—గదాం=కౌమోదకియనుగదను, శంఖం=పాంచజన్యమనుశంఖమును, చక్రం=సుదర్శనమనుచక్రమును, పరిమళయుతం=(మానత్వముకుళీభావములులేక సార్వకాలికవికాసంబు గల్గియుండుటచే) మితిలేనివాసనగల, అమలం=తెల్లని, పద్మం=సహస్రదళయుతంబగుతామరపువ్వును, హస్తాబ్జైః=ఫుల్లాంభోజములవలె శోభిల్లుతనచేతులతో, దధానః=పట్టుకొనుచున్నవాడును, (చతుర్భుజుండగు శ్రీమన్నారాయణుండు తనకరంబులలో రెండిటిచే చూచినంతనె తత్ప్రభావంబు జ్ఞప్తికిరాను శత్రువులగుండెలు తమంతనె వ్రక్కలగునటుల కౌమోదకీసుదర్శనములను, ఒక

చేత సహేతుకంబగు క్రోధమోదంబుల దనయుత్సాహాతిరే
కంబును సూచించు పాంచజన్యంబును, ఏవంవిధ భీకరాకా
రుడయ్యును మహావిలాసశేఖరుండన నొప్పు నొక కేల సితాం
భోజమును ధరించుచు దుష్టవర్తనులకు భయంబును సద్వ
ర్తనులకు మోదంబును తనమూర్తి దర్శనమాత్రమున గలిగిం
చుచున్నాడని తాత్పర్యము.) సకలసురసంఘార్చితపదః=
సకల=సమస్తమైన, సురసంఘ=దేవతాసముదాయముచే,
(ఇంద్రాద్రిసమస్తదేవతలచేతను) అర్చిత=పూజింపబడిన, ప
దః=పాదములుగలవాడునగు (దేవతులందరు భక్తినమ్రులై
యీమహామునిపాదముల కభివందనము చేయుచున్నారని
తాత్పర్యము.) యః=ఏనారాయణమూర్తి, భక్తానాం=
పూజ్యుండని యవ్యాజభక్తిని తన్ను గొల్చుచుండెడిభక్తులకు
అతులఫలదానైకనిరతః, అతుల=నిరుపమానమైన, (లౌకిక
ఫలంబులు సదృశవస్తుభూయిష్టంబులై యుండునుగాని యు
పరిమేయగుణుండును, భక్తపరాయణుండు నగుభగవంతు
డు సేవకులకిచ్చుఫలము నిరుపమానమైనదని తాత్పర్యము.)
ఫలం=ఫలమును (మోక్షఫలమును) దాన=ఇచ్చుటకు,
ఏక=కేవలము, నిరతః=ఆసక్తిగలవాడో, (భక్తులనెల్ల ము
క్తులనుచేయుచున్నాడని తాత్పర్యము.) వైకుంఠస్థాయీ=
ఎప్పుడు వైకుంఠమందేయుండెడు, సః=సకలశ్రుతివిశ్రుతు
డైనయాపురాణపురుషుడు, మే=నాకు, సకలశుభదాయీ=
సమస్తశుభంబులనొసంగువాడు, భవతు=అగుగాత.

శంఖచక్రగదాపద్మధారియై దేవతులెల్ల తన్ను గొల్చుచుండ భక్తులకోరికలనిచ్చు వైకుంఠవాసి యగుభగవంతుడు నాకు సమస్తశుభముల నిచ్చుగాతయని తాత్పర్యము.

మమత్వయ్యుత్పన్నాంమతిమతిశుభాకారతరుణీం
సుధాబ్ధేస్సంలబ్ధాంశ్రియమివగృహాణాశునృహరే
యఇత్థందాతారంస్వపదముపనీయాశుశుభకృత్
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే. 2

అర్థము:—నృహరే!=భక్తవిద్వేషులను దెగటార్చుటకై యవతరించిన యోనృసింహమూర్తీ, త్వయి=పరమపూజ్యుండవగునీయెడల, మమ=నీభక్తుడనగునాకు, ఉత్పన్నాం=కలిగిన, అతిశుభాకారతరుణీం, అతి=మిక్కిలి, శుభాకార=అమాయకముగావర్తించినదగుటచే యుక్తమైనదియు, తరుణీం=వర్ధమానమును లేక దృఢమునునైన, మతిం=బుద్ధిని, (ఇక్కడ మతిం అని స్త్రీలింగనిర్దేశమువల్ల మమ=నాకు, త్వయి=నీవిషయమై అనగా నీకర్పించుటకు, ఉత్పన్నాం=జనించిన, అతిశుభాకారతరుణీం=సర్వావయవసౌష్ఠవముచే శుభప్రదమగునాకృతినొంది యౌవనదశలోనున్నకన్యను, అని మరియొకయర్థముగూడ స్ఫురించును.

సుధాబ్ధేః=అమృతసముద్రమునుండి, సంలబ్ధాం=పొం

దబడిన, శ్రియమివ=ఆదిలక్ష్మినివలె, ఆశు=శీఘ్రముగా, గృహాణ=తీసికొనుము, ప్రేమించి నిన్నువిడువకుండునటుల జేయుము. పరమపూజ్యుండును, భక్తపరాయణుండు నగు నిన్ను తనంతసేవరించి, సర్వావయవసుందరియై శుభాకృతితో జనించి యుక్తవయస్సునందినకన్యవలెనున్న నామనోవృత్తిని, సముద్రదత్తయగుయాదిలక్ష్మినివలె దయతో బరిగ్రహించి యెన్నడూ నిన్ను విడిచియుండకుండునటుల జేయుమని భావసమర్పణజేయుచున్నాడు. ఇత్థం=ఈరీతిని, దాతారం=తనమనోవృత్తినర్పించువానిని, స్వపదం=తననివాసస్థానమగు వైకుంఠమును, ఉపనీయ=పొందించి, యః=పీదయాళుడు, ఆశు=శుభస్యశీఘ్రమ్మను న్యాయమునను సరించి వేగముగా, శుభకృత్=మేలుచేయుచున్నాడో, అనగా ముక్తులనుజేయుచున్నాడో, ఇక్కడ ఇత్థం=ఈరీతిగా, దాతారం=కన్యాదానముచేయుదీనుని, స్వపదముపనీయ=తనయింటికితోడ్కొనివెళ్లి, ఆశు=విఘ్నబాహుళ్యభీతిచే శీఘ్రముగా, శుభకృత్=వివాహముచేయువాడనియు నర్థముస్ఫురించును. అనగా యజ్ఞాదికర్మలు జేయుటకు నేను రిక్తుండను. చాంద్రాయణాదివ్రతములు జేయుటకు బలములేదు. తటాకారామాదినిర్మాణమునకు సాహాయ్యసంపత్తిలేదు. గాన పాలముంచినను నీళ్లముంచినను నీవేగతియని నమ్మి యమాయకముగా మనోవృత్తిని నీయందుంచుచున్నాను. భక్తుడనగు నాయందుదయయుంచి నన్ను

సద్గతినొందింపుమని యర్పించువానిని ముక్తునిజేయుచుండు నిభావము. వైకుంఠస్థాయీ = ఎల్లప్పుడును వైకుంఠమునందుండెడు, సః = ఆపురాణపురుషుడు, మే = నాకు, సకలశుభదాయీ = సమస్తశుభములనిచ్చువాడు, భవతు = అగుగాక.

సత్కార్యాచరణసమర్థత లేకున్నను యమాయకముగా భగవంతునియందు దృఢముగుమనోవృత్తిగలవారు తప్పక ముక్తినొందెదరని తాత్పర్యము.

కదాచిచ్ఛ్రీదేవీస్వపతిహృదయే కౌస్తుభమణౌ
స్వబింబేశ్రీరన్యాజయతిసహసేతిభ్రమమగాత్
తదాత్రాసాహేతుస్సహజమణిరేవేతివిహసన్
స వైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే॥ 3

అర్థము :—కదాచిత్ = పూర్వమొకప్పుడు, శ్రీదేవీ = సర్వాంతర్యామియు సర్వవ్యాపకుండు నగువిష్ణునిభార్యయు, శోభాసంపదలకధిదేవతయు నగులక్ష్మీదేవి, స్వపతిహృదయే = తనభర్తయగువిష్ణుమూర్తియొక్క వక్షఃస్థలమునందున్న, కౌస్తుభమణౌ = కౌస్తుభమనుమాణిక్యమునందు, స్వబింబే = అద్దమువలె స్వచ్ఛముగానుండు నామణిలో ప్రతిబింబించిన తనరూపమునందు, అన్యాశ్రీః = తనకన్న వేరగునింకొకలక్ష్మీదేవి, జయతీతి = నేను విష్ణుమూర్తివక్షః

స్థలమునందేయుంటినిగాని యీామె యావక్షఃస్థలమునలంక రించుచున్న కౌస్తుభమణిపై దానివన్నె నెచ్చించుభూషణ ముగా నుంచబడుటచే నన్ను జయించుచున్నది. లేక స ర్వోత్కృష్టముగానున్నది. అని, భ్రమం = మరియొకలక్ష్మి యనెడుభ్రాంతిని, అగాత్ = పొందెను. సాధారణముగా స్త్రీలు శంకితమనస్కులగుటచే తమవల్లభుల ప్రేమానుబం ధంబున కొంచెమైన ననుమానాభాసకారణము సంభవించి నచో దానిని విమర్శించి నిజముగ్రహించక భ్రాంతులగుట సహజమైయున్నది. అందుచే నాభాసరూపమగు తననీడ నజూచి మరియొకతెయని యామె భ్రమపడెను. తదా = అప్పుడు, అత్ర = ఈభ్రాంతిలో, అసౌ = ఈదగ్గరనున్న, సహజమణిరేవ = నీతోబుట్టువగుమాణిక్యమే. ( పూర్వ మ మృతమునిమిత్తము దేవతులు రాక్షససహాయులై పాలకడలి మథించునపుడు కల్పతరు, కామధేను, ఐరావత, కౌస్తుభ, లక్ష్మ్యాదులుద్భవించెను. వానిలో కౌస్తుభమణిని శ్రీవిష్ణుడు వైకొని యురోభూషణముగా దాల్చెను. పిదప ననపాయ మగుప్రేమను లక్ష్మినిజేబట్టి తనవక్షంబున నుంచుకొనియె దాన నాయిరువురకు సహజత్వమని యెరుంగునది.) హే తుః = కారణము, ఇతి = అని, విహసన్ = తననీడనేజూచి మరియొకకాంతయని భ్రమించిన లక్ష్మియవివేకమునకు నవ్వు చు, వైకుంఠస్థాయీ = ఎల్లప్రుడు వైకుంఠముననున్న, సః = సకలవేదాన్తవేద్యుడగు నావిష్ణుమూర్తి, మే = నాకు, సుక

లశుభ దాయీ = సమస్తశుభంబులనిచ్చువాడు, భవతు = అగుగాత

నిర్మలమగు మణిలో తన నీడను జూచి మరియొక తెయ ని భ్రమ జెందినయాది దేవిని నీతో బుట్టువగు మణిలో నీ నీడనే జూచి యిట్లేల భ్రాంతినొందెదవని నవ్వుచు వైకుంఠంబున నున్న భగవంతుడు నాకు సకలశుభంబుల నిచ్చుగాక యని తాత్పర్యము.

హారేకృష్ణానంతాచ్యుతగరుడవాహామరవిభో
మురారేపద్మాక్షప్రబలతర కారుణ్యజలధే
ఇతిస్మర్తుర్యోఽదాద్దురితమపనుద్యాత్మవసతిం
స వైకుంఠస్థాయీ సకలశుభ దాయీ భవతు మే॥4

అర్థము :—హరే ! = ఇచ్ఛచేగాని యనిచ్ఛచేగాని నీ నామమును తలచినంతనే దుష్టులయొక్కయు పాపముల న శింపజేయువాడా ! కృష్ణ = ఓకృష్ణమూర్తీ, అనంత = ఎప్ప టికిని నాశములేనివాడా ! అచ్యుత = భంగరహితుడా ! గ రుడవాహ = విహంగరాజైన గరుడుడు వాహనముగాగలవా డా ! అమరవిభో = దేవతులకెల్లప్రభువా ! మురారే = సక లజగత్కంటకుండగు మురాసురుని సంహరించినందున వాని కి శత్రువైనవాడా ! పద్మాక్ష = వికసించిన పద్మములవం

టినేత్రములుగలవాడా! ప్రిబలతగకారుణ్యజలధే, ప్రిబల
తర = విస్తారమైన, కారుణ్య = దయకు, జలధే = సముద్రము
వంటివాడా! (మితిలేని దయగలవాడని భావము.) ఇతి =
ఈమొదలగు భగవద్వాచకము లగుపర్యాయపదములచే,
స్మర్తుః = వానినిస్మరించువానియొక్క, దురితం = అపారమ
గునీసంసారములో తానొందినజన్మలలో నప్పటివరకుజేయ
బడియున్న పాపసంఘమును, అపనుద్య = జంఝామారుత
ము రజస్సును బారదోలినటుల మానవుల బాపములనెల్ల
నొక్కసారిబోగొట్టి, ఆత్మవసతిం = తనతావగువైకుంఠము
ను, యః = దయాళుడగు నేభగవంతుడు, అదాత్ = ఇచ్చె
నో, (యజ్ఞాదికముల నాచరించుటకు సామర్థ్యములేదు.
నిశ్చలమగు మనంబును నీపైనిల్పుటకు స్థైర్యముచాలదు.
కేవలము నీనామముల నుచ్చరించుచు నిన్ను స్మరించెదనని
స్మరించినను కలౌతు స్మరణాన్ముక్తియను న్యాయానుసార
ముగా తనతావునిచ్చుచు శ్రేయస్సు నొనగూర్చుచున్నా
డని భావము.) వైకుంఠస్థాయీ = ఎల్లపుడు వైకుంఠమున
నుండెడు, సః = ఆభగవంతుడు, మే = నాకు, సకలశుభ
దాయీ = సర్వశుభంబులనిచ్చువాడు, భవతు = అగుగాత.

ధ్యానధారణాదికములకు మనోదార్ఢ్యములేకున్న
ను కేవలము తననామములను లీలగానైన గీర్తించుచు స్మ
రించువారిని భక్తవత్సలుండగుపరాత్పరుడు ముక్తినొందిం
చుచు శ్రేయఃప్రదు డగుచున్నాడని తాత్పర్యము.

విశాలేయన్నే(తేదినకరనిశేశౌశుభకరౌ
యదంఘ్రిబ్జాజ్జాతామృతరసఝరీవామరనదీ
రమాయస్యోరఃస్థానకలసుమనోవందితపదా
స వైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే॥ 5

అర్థము :— శుభకరౌ = ప్రత్యక్షదైవములై తమదర్శనశూన్యమైనదినమును దుర్దినమునుగా వాడుటచే దర్శనమిచ్చి సుదినంబునఁజేసి తమ యుదయాస్తమయములచే దివారాత్రంబులఁజేయుచు యీసృష్టిలోనుండు జీవులనెల్ల తత్తాలోచితవ్యాపారములలో నియమించుచు తత్తత్ఫలంబుల నిచ్చుచుండుటచే నెల్లరలకు శుభముకలుగఁజేయు, దినకరనిశేశౌ = పగటినిజేయుసూర్యుడు, రాత్రికి నాయకుడగుచంద్రుడున్ను, విశాలే = ఆకర్ణాంతవ్యాప్తములైన, యన్నేత్రే = ఏభగవంతుని నేత్రములైయొప్పుచున్నారో, అనగా విరాడ్రూపుండగుభగవంతుడు లోకానుగ్రహ తత్పరుడై సూర్యచంద్రులనెడితననేత్రములతో జీవులనెల్లఁజూచి వారి యోగక్షేమములనరసి శుభముల నిచ్చుచున్నాడనిభావము. అమరనదీ = దేవనదియని ప్రసిద్ధిగాంచి ముల్లోకములలోఁబ్రవహించి ఎల్లరను పవిత్రముఁజేయుఁగంగానది, అమృతరసఝరీవ = స్నానపానాదులచే అనంతజన్మార్జితపాపౌఘములనెల్లబాపి మహానందమున నోలలాడించునదగుటచే అ

మృతప్రవాహమువలెనున్నది, యదంఘ్ర్యబ్జాత్ = ఏభగవంతునిపాదపద్మములనుండి, జాతా = పుట్టినదో, సకలసుమనోవందితపదా = ఇంద్రాదిసమస్తదేవతులచే నెల్లపుడు నమస్కరింపబడుచున్న పాదములుగల, రమా = లక్ష్మి, యస్య = ఏభగవంతునియొక్క, ఉరఃస్థా = వక్షస్థలమునవున్నదో, వైకుంఠస్థాయీ = ఎల్లపుడు వైకుంఠమునవుండెడు, సః = సకలలోకవిశ్రుతుడైన యాభగవంతుడు, మే = నాకు, సకలశుభదాయీ = సమస్తశుభములనిచ్చువాడు, భవతు = అగుగాత.

శుభకరు లగుసూర్యచంద్రులను నేత్రస్థానమునదాల్చి జగత్పావని యగుత్రిపథగను తనపాదమున సృజించి లోకము పవిత్రముగాజేయుచు లక్ష్మీసమాశ్లిష్టుడై మితిలేని మోదమందుచు వైకుంఠమునవున్న నారాయణుడు శుభప్రదుడగుగాకయని తాత్పర్యము.

ప్రవిశ్యాంతర్నాభేర్జఠరమభితఃపద్మజనిభూః
జగద్దృష్ట్వావిష్ణోర్బహిరపితథాసృష్టిమకరోత్
సదారఃపశ్యంస్తాంముదితహృదయోహారిరభూత్
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే॥6

అర్థము :—పద్మజనిభూః, పద్మ = వెయ్యిరేకులుగల

తామరపువ్వు, జనిభూః = జన్మస్థానముగాగలబ్రహ్మ, త్రిమూర్తులలోనొక్కరుండును, శుద్ధసత్వమూర్తియు, చరాచరాత్మకసకలప్రపంచనిర్మాతయునగువిధాత శ్రీమన్నారాయణుని నాభికమలమునం దవతరించినటుల పురాణప్రసిద్ధమైయున్నది.) ప్రథమం = తాను సృష్టిచేయకముందు, విష్ణోః = సర్వాంతర్యామియు, సకలవ్యాపకుండు నగువిష్ణుమూర్తియొక్క, ఉదరే = గర్భమునందు, నాభ్యాః = ఆయననాభినాళముగుండా, ప్రవిశ్య = ప్రవేశించి, అంతః = ఆయనగర్భములోనిమిడియున్న (ప్రళయకాలంబున నీశ్వరుండు సకలజగత్సంహరణోద్యుక్తుడైయుండ, భీతివివశమైయున్న నీప్రపంచంబున కేయుపాయంబునుగలుగకుండ, భూతదయాళుడగునారాయణుడు, చరాచరాత్మమగునీజగంబునెల్ల తనగర్భమునదాల్చి కాపాడెననుయంశము సూచింపబడినది. జగత్ = గర్భస్థమగుప్రపంచమును, దృష్ట్వా = చూచి, బహిరపి = ఆయనగర్భములోవలె పైనిన్ని, సృష్టిం = ప్రపంచనిర్మాణమును, అకరోత్ = చేసెను, బ్రహ్మతాను సృష్టిచేయకముందు, భగవంతునిగర్భములోనుండుప్రపంచమునెల్లజూచి దానిని మాతృకగాజేసికొని బాహ్యప్రపంచమునెల్ల నిర్మించెననిభావము. పిమ్మట తాం = ఆబాహ్యప్రపంచనిర్మాణమును, సదారః = తనభార్యయగు లక్ష్మితోగూడినవాడై, పశ్యన్ = కౌతుకాశ్చర్యములతో జూచుచు, యో హరిః = ఏవిష్ణుమూర్తి, ముదితహృదయః = సంతసించినమన

ప్పగలవాడు, అభవత్ = ఆయెను, (సామాన్యముగా మనుష్యులే యీలోకములో తమపిల్లలవివేకముచే చెడ్డపనినైననుజేసినచో పిల్లలయెడ తమకుండువాత్సల్యాతిశయముచే వారిపనిని ముమ్మాటికిజూచి సంతసించుచుండ సర్వాశ్చర్యకరమును, అనితరసాధ్యమగు నీచరాచరబాహ్యప్రపంచమును, తనగర్భములో నొక్కమారుజూచి యున్నదున్నటులనసహాయుడై యొక్కపిల్లడు సృజింప వానితల్లిదండ్రులకు సంతసముకలుగుననుటకు వేరచెప్పనేల. వైకుంఠస్థాయీ = ఎల్లపుడు వైకుంఠముననుండెడు, సః = ఆపురాణపురుషుడు, మే = నాకు, సకలశుభదాయీ = సమస్తవిధములైన శుభంబులనొసంగువాడు, భవతు = అగుగాక.

సృష్టికర్తయగుబ్రహ్మ తనగర్భములోనుండుప్రపంచము నొక్కమారుజూచి బైని యిట్లునిర్మింప వానియఘటితఘటనాసామర్థ్యమును జాయాసహితుడైజూచి మోదపరవశుడగుభగవంతుడు శుభప్రదుడగుగాక యనితాత్పర్యము.

త్వయామహ్యందత్తావసతిరిహసంబాధసహితా
తదన్యన్మేస్థానంనిరుపమమబాధందిశవిభో
నచేదంబాంయాచేభువనజననీంచేతివరదః
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే॥ 7

అర్థము :—ఇహ = పురాకృతకర్మవశంబున నానా

యోనులఁబ్రవేశించి మాటిమాటికి బుట్టుచు గిట్టుచు నపార మగువేదనలపాలై తగిన సాధనసామగ్రిలేక తదున్మూలన ముజేయ వలనుబడని యీసంసారములో, త్వయా=భక్త పరాయణుండవై యతిదీనులగుసేవకుల ననపాయమగుదయ తోఁజూచుచు నైహికాముష్మికసుఖంబుల నొసంగెడునీచే మహ్యం=తావకీనసేవకులలో నొకడనైననాకొఱకు, సం బాధసహితా=మిక్కుటమగుబాధలతోఁగూడిన, వసతిః= బస, దత్తా=ఈయబడినది. (సంసారములో ప్రతిమానవు డు స్వకర్మప్రేరితుడై యాయాకర్మలజేయుచు తత్తదుచిత ఫలంబుల ననుభవించుటకై జన్మలనొందునపుడు మితిలేని గర్భయాతనల ననుభవించును. పిదప భోగ్యవస్తువులననుభ వించునపు డాభాసికసుఖమున్నను తద్వ్యవధానవినాశంబు లనేకగల్గు బాధలకోర్వలేక శూన్యమనస్కుడై మాటిమాటి కి దుఃఖాంధకారములోబడి బలుబాము లనుభవించుచు నె న్నటికి మనఃస్వాస్థ్యము లేకయుండుననిభావము. తత్= ఆకారణమువల్ల, విభో=సర్వశక్తుండవగు నోపరాత్పరుడా నిరుపమం=అలౌకికస్థానమగుటచే సాటిలేని అబాధం=కేవ ల సుఖస్వరూపమై విస్తృతమైయున్నందున బాధలులేని, అన్యత్ స్థానం=మఱియొకతావును, (అబాధకమైనిరతిశ యానుపమానందపరిదమగుస్థలమును) మే=నాకు, దిశ=ద యచేయుము, నచేత్=అటులదయచేయకుంటివేని, భువన జననీం=సమస్తభువనములకు తల్లియగు (ఈసృష్టిలోనుండు

సమస్తజీవుల యోగక్షేమములనరసి కాపాడవలసినపనిగల) అంబాం = మాతల్లియగుయాదిలక్ష్మిని, యాచే = యాచించె దను. ఇతి = అనుమాటను విని, వరదః = సమస్తవరములని చ్చి కాపాడుచు, వైకుంఠస్థాయీ = ఎల్లపుడు వైకుంఠమున నున్న, సః = ఆభగవంతుడు, మే = నాకు, సకలశుభదా యీ = సర్వశుభంబుల నిచ్చువాడు, భవతు = అగుగాత.

అయ్యా? నేనీసంసారములో మితిలేనిబాధలొందు చున్నాను. అనాథుండను, భూతదయాళుండును, సర్వశ క్తుండును నగునీవు నాకు సుఖకరంబగు తావిచ్చి యీబా ధలబాపి కాపాడుమని భక్తితో వేడినవారి బాధలడంచి కాపాడుచున్నాడని తాత్పర్యము.

బుధాదుగ్ధాంభోధాభుజగపతిపర్యంకతలగం
జగన్నాథంనత్వాదితిజకృతబాధామకథయ  
పరిబుద్ధస్తేషాంయోఘుషితిభయరాహిత్యమక
రోత్
స్సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే॥ 8

అర్థము :—బుధాః = ఇంద్రుడు మున్నగుదేవతులం దరు, దుగ్ధాంభోధా = ఆదిలక్ష్మికి పుట్టినిల్లగుపాలసముద్ర మునందు, భుజగపతిపర్యంకతలగం, భుజగపతి = సర్పముల

కెల్లప్రభువును, సర్వంసహాయగు నీభూమినెల్లను విరామములేక భరియించెడు అనంతుడను, పర్యంకతలగం = మంచమునపరుండి నిద్రించుచున్న, జగన్నాథం = ఎల్లజనులకు ప్రాపగుభగవంతుని, (ఆషాడశుద్ధ యేకాదశిమొదలు కార్తికశుద్ధ యేకాదశివరకును భగవంతుడు పాలసముద్రమునందు శేషపాన్పుపై పరుండునని యు నానాల్గునెలలు నందుచే మనవారలెల్ల నతిపట్టుదలతో చాతుర్మాస్యవ్రతమును చేయుదురు.) నత్వా = భక్తిపరవశులై నమస్కరించి, దితిజకృతబాధాం = తమకు తగిననాథుడుదగ్గరలేకుండుటచే, దితిజ = దితిపుత్రు లగురాక్షసులచే, కృత = తమకొనర్పబడిన, బాధాం = బాధను, అకథయన్ = ఆర్తత్రాణపరాయణుడును భక్తవత్సలుడునగుటచే నాతనితో మనవిచేసికొనిరి. భగవంతుడు వైకుంఠమునువిడచి శ్వశురగృహంబున శేషశయ్యపై నిద్రాపరవశుడై యుండుతరిని ఇదియేసమయమని నిశాచరులు దేవతులకు మితిలేని బాధలనొందించుచు వచ్చిరి. ఆబాధలకోర్వలేక వారు తమప్రిభువగుభగవంతునితో నీ రాక్షసుల బాధలనుండి మమ్ము నెటులనైన కాపాడుమని విన్నవించుకొనిరి. పిదప ప్రిబుద్ధః = నిద్రనుండిమేల్కొని పరిక్కనుండిలేచినవాడై, తేషాం = ఆదేవతులకు, యః = ఏభూతదయాళుడు, ఝుడితి = వేగముగా, భయరాహిత్యం = భయములేకుండుటను, అకరోత్ = చేసెనో, (రాక్షసులను బరిమార్చి సర్వప్రపంచమును నిష్కంటకముగను

నిరుపద్రవముగను చేసెనో, వైకుంఠస్థాయీ = ఎల్లప్పుడు వైకుంఠమునందేయుండెడు, సః = ఆభగవంతుడు, మే = నాకు, సకలశుభదాయీ = సర్వశుభముల నొసగువాడు, భవతు = అగుగాక.

ఎంత మహదైశ్వర్యవంతుడైయున్నను ఆర్తత్రాణపరాయణుండగుభగవంతుడు ఆర్తాక్రందనము చెవినిబడిన వెంటనే తానెట్టియవస్థలోనున్నను విముఖచెందక తప్పక వచ్చి వారియిక్కట్టులబాపి కాపాడునని భూతదయాళుత్వము సూచించుచున్నాడని తాత్పర్యము.

యదాక్షీరాంభోధేర్గిరిమథనవేళాసముదితం
సుధాపాత్రంగృహ్ణాన్స్వయమదితిజేభ్యోమృతమదాత్
తదాస్త్రైణంరూపందితిసుతవిమోహాయకలయన్
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే॥ 9

అర్థము:—క్షీరాంభోధేః = "లవణేక్షు సురాసర్పిదధి క్షీరజలార్ణవాః" యని మనపురాణములలో వాడబడుచున్న సప్తమహాసముద్రములలో నొక్కటి యగుపాలసముద్రమునుండి, గిరిమథనవేళాసముదితం, గిరి = మందరపర్వతముతో, మథన = తరచెడు, వేళా = సమయమునందు, సము

దితం = పొందబడిన, సుధాపాత్రం = జరామరణములు రా కుండునటుల జేయు యమృతముతో నిండియున్న కలశను, గృహ్ణాన్ = పట్టుకొనుచు, స్వయం = భృత్యులనునియమించక తనంతటతానే, యదా = యేసమయమునందు, అదితిజేభ్యః = కశ్యపమహామునిభార్య లగుదిత్యదితులలో యదితి యనునామెకు బుట్టినదేవతులకొరకు, అమృతం = అమృతముగు, అదాత్ = ఇచ్చెనో, తదా = అప్పుడు, దితిసుతవిమోహాయ, దితిసుత = దితియనునామె పుత్రులగురాక్షసులయొక్క, విమోహాయ = ఆగరూపువైయుండునప్పు డమృతఘటమును తీసికొనుటకు వీలులేకుండుటచే మోహమువల్ల తెలివిలేనివారినిగాచేయుటకు, స్త్రైణం = స్త్రీసంబంధమైన, రూపం = ఆకారమును, మోహినీస్వరూపమును, ( కశ్యపుండనుమహాముని కి, దితి, యదితి యనునిర్వురు భార్యలుగలరు. ఆయిరువురిలో దితికిబుట్టినవారెల్ల దైత్యులనియు, అదితికిబుట్టినవారెల్ల ఆదితేయులనియు వ్యవహరింపబడుచున్నారు. వీరినే రాక్షసులనియు, దేవతులనియు వ్యవహరింతురు. వీరుభయులును పూర్వము కృతయుగంబున తమకెన్నటికిని ముదిమి, చావును రాకుండ యమృతమును గ్రోలుటకై వాసుకియనుమహానాగమును త్రిప్పుతాడుగను మందరపర్వతమును కవ్వముగానుజేసి యమృతమునిమిత్తము సముద్రమును మథించిరి. ముందు హాలాహలముబుట్ట దాని నీశ్వరుడుమ్రింగి వారిభీతి బాపెను. పిదప ధన్వంతరి, యచ్చర

లు, వారిపరిచారికలు, సురా, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, ఉచ్చైశ్శ్రవము, ఐరావతము, కౌస్తుభము, చంద్రుడు, లక్ష్మి మున్నగునవిపుట్టెను. వానిని దేవతులలో కొందరు కొన్నిటిని చేర్మిలోగైకొనిరి. చివర కమృతముబయలుదేరెను. వెంటనే దానిని దైత్యులపహరించిరి. పిదప దేవతులును రాక్షసులును నమృతమునిమిత్తమై మిక్కిలి కలహపడి చాలలేక దేవతులు భగవంతునివేడగా మోహినీరూపుడై రాక్షసులను మోహపరవశులనుగాజేసి వారివద్దనున్న యమృతమునుగైకొని దేవతులకెల్ల నిచ్చెనను కథాంశమును సూచించుచున్నది. కలయన్ = అంగీకరించుచు, వైకుంఠస్థాయీ = యెల్లపుడు వైకుంఠమునసనివసించెడు, సః = ఆయపరిమేయమహిమాఢ్యుడగుభగవంతుడు, మే = నాకు, సకలశుభదాయీ = సకలశుభంబుల నిచ్చువాడు, భవతు = అగుగాత.

భూతదయాళుండును, భక్తపరాయణుండును నగు భగవంతుడు నీవే శరణయని నమ్మి తన్ను గొల్చుభక్తులను తా నెన్నిశ్రమలుబడియైనను వారిబాధలడంచి కృతకృత్యుల జేయుచున్నాడని తాత్పర్యము.

శిలీభూతాంశాఘాత్తవచరణధూళీకులవధూ

రహల్యాంకుర్యాదిత్యుదితవచనేకౌశికమునౌ

తథాచక్రే రామో మునివరవధూం యస్సకరుణః
స వైకుంఠస్థాయీ సకలశుభదాయీ భవతు మే. 10

అర్థము :—కౌశికమునా = నిరుపమానమైన తపోమహిమాగల్గి యొక్క జన్మంబుననే రాజర్షి పదమును విడచి బ్రహ్మర్షి పదముచే వ్యవహరింపబడిన తాపసోత్తముం డగు విశ్వామిత్రుడు, శాపాత్ = భర్త యగు గౌతమమహామునియొక్క శాపమువల్ల, శిలీభూతాం = రాయియైయున్న గౌతముని భార్యను, (మహర్షి సత్తముం డగు గౌతముడు ప్రతిదినము తన యాహ్నికముల నిర్వర్తించుకొనుటకై యుషఃకాలంబున కుక్కుటధ్వని నాకర్ణించి నిద్రమేల్కొని నదీతీరమునకు జనుచుండెడివాడు. అసంగతి నెరింగి యొకనా డహల్యాజారు డగు నింద్రుడు స్వయముగా కుక్కుటధ్వని జేసి ఋషిపుంగవు నిద్రమేల్కొలిపి కాలోచితకృత్యంబుల నిర్వర్తించుటకై యథాపూర్వము నదికంపి యాతాపసోత్తముని భార్యయు పతివ్రితయు నగు నహల్యను ఆమెయనుమతి లేకయే బలవంతముగా గూడియుండ నెప్పటికిని తెల్లవారకుండుటచే నింతలో యింటికేతెంచిన గౌతముని దృక్పథంబునబడి వారిరువురును కోపావిష్టుడైన తాపసవర్యునిచే శపింపబడిరి) తవ = పరమపూతుండ వగు నీయొక్క, చరణధూళీకులవధూః = పాదధూళియనెడు పతివ్రితాశిరోమణియగుటలాంగన, అహల్యాం = తిరిగి యహల్యనుగా, కుర్యాత్ = చే

యగాక, ఇతి = అని, ఉదితవచనే = పలకబడినవాక్యము గలవాడైయుండగా (సర్వజ్ఞుండగు కుశికనందనుడు శ్రీరాముని మహత్త్వముసెఱింగి భర్తృశాపవశంబున రాయియై నీ రాకకొరకై వేచియున్న యీయహల్యకు, నీపాదరజస్సును సోకునటులజేసి తిరిగి స్వరూపంబొసగి పతికొసంగుమని యాజ్ఞాపించెను. చరణధూళీకులవధూః అని ధూళియందుకులవధూత్వారోపముచే శ్రీరామపాదరజస్సువలె సతీమణులగుకులకాంతల పలుకులు నమోఘములైనవి, వారి యానతొసంగ్వన నెరవేరని దొక్కటియు లేదనుసంశము సూచింపబడెను. పిదప యః రామః = ఏశ్రీరాముడు, సకరుణః = శాపబాధిత యగుమునిభార్యయందు దయగలవాడై, మునివరవధూం = మునిశ్రేష్ఠుడగుగౌతమునిభార్యను, తథా = మునిసత్తముని యానపరికార మహల్యనుగా, చక్రే = చేసెనో, వైకుంఠస్థాయీ = ఎల్లప్పుడు వైకుంఠంబుననుండెడు, సః = ఆపురాణపురుషుడు, మే = నాకు, సకలశుభదాయీ = సమస్తశుభంబుల నొసగువాడు, భవతు = అగుగాక.

“పరిత్రాణాయసాధూనా” మని గీతములలోనుడివినటుల జగత్కంటకు లగురాక్షసుల సంహరించి సాధుసంరక్షణచేయ నవతరించిన రామమూర్తి తాపసోత్తముని యాగంబు కాపాడబోవుచు మార్గమధ్యంబున మునియాజ్ఞచేయహల్యాశాపమోచనము చేసెను. అనుకథ సూచింపబడినది.

పాదధూళియే రాతిని నాతిగా నొనర్చుటచే నచిం త్య మహిమాఢ్యు డగు భగవంతుడు నాకు సకలశుభంబుల నిచ్చుగాక యని తాత్పర్యము.

గృహీతాస్త్రో రామోరణభువినిహత్యాశుసకులం
సలంకేశంసీతాంతదనుచగృహీత్వాగ్నివచనాత్
విమానంయఃకీశైరగమదధిరుహ్యాత్మనగరం
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే. 11

అర్థము :—సరామః = ఈశ్వరవరప్రదాన గర్వితుడై త్రిజగత్కంటకు డగు నాలంకేశుని సంహరించుటకై దశర ధునింట కౌసల్యాగర్భమునం దవతరించి! సకల సుగుణమణు లకు ఖనియు, సత్యవ్రతపితృభక్తులకు మార్గదర్శియునై మ హాకవియగు వాల్మీకమహామునిచే పరిబంధరూపముగా నిబ ద్ధమైన తనచరిత్రచే సకలలోకమును పవిత్రము జేయుచు ని ఖిలజగద్విఖ్యాతుడైన శ్రీరామదేవుడు, గృహీతాస్త్రః = స్వ జాతిసముచితంబగు నాయుధమును చేతబూనినవాడై, ఆశు = వేగముగా, సకులం = తనవంశముతో గూడిన, లంకేశం = చ తుస్సముద్రపరిఖావలయితమై యితరదురవగాహం బగులం కకు నాయకుండగు రావణుని, రణభువి = మహావీరుండును ధీరోదాత్తుండు నగుక్షత్రియుడు సమబలుండగు ప్రతిభటుని ఉపాయాంతరములచేతను, గూఢముగాను వధించుట వాని

కే లజ్జాకరంబును, దుష్కీర్తిసంధాయకంబును నగుటవల్ల
ను గాక తనకు శత్రుండైనను రావణుని యుద్ధభూమియం
దు శస్త్రపూతునిజేసి వీరస్వర్గమునొందించదలచియు యు
ద్ధభూమియందే, నిహత్య = చంపి, తదను = ఆ రావణునిసం
హరించినపిదప, అగ్నివచనాత్ = సీత చిరకాలము పరగృ
హమునందుండుటచే యామెయోగ్యతనెరిగినను లోకులకు
వెరచి రాముడు పరిగ్రహించుట కనుమానించుచుండ, నీమె
పరమపతివ్రత, పరగృహవాసముతప్ప యేదూషణమునులే
దు. కాచే యీమె సతీత్వము పరీక్షించబడినది. గాన నీ
మెవిషయమై సుంతైన ననుమానించక తప్పక పరిగ్రహించ
వలయునని మున్మాటికి నుడివిన వీతిహోత్రునిపలుకులవలన,
సీతాం = ఉత్పత్తిపరిపూతయు, శుద్ధచారిత్రయు, నగుసీత
ను, గృహీత్వా = అగ్నిహోత్రునివాక్యము శిరసావహించి
సతీలలామ యగుసీతామహాదేవిని తిరిగి గ్రహించి, యః =
ఏమహానుభావుడు, కీశైః = జగత్కంటకు డగురావణునిసం
హరించుటలో రామునికి తగినంతసహాయము చేయుటకై భూ
మియందవతరించి, సీతాన్వేషణాదికార్యములలో మహా
సహాయంబొనర్చిన సుగ్రీవాంజనేయాది వానరముఖ్యులతో
విమానం = స్వపక్షుండును పరమభక్తుండు నగువిభీషణునిచే
యర్పించబడిన విమానమును, అధిరుహ్య = ఎక్కి, ఆత్మనగ
రం = తనపట్టణముగునయోధ్యపురిని, అగమత్ = పొందెనో
వైకుంఠస్థాయీ = ఎల్లప్పుడు వైకుంఠమునను౦డెడు, సః =

ఆభగవంతుడు, మే = నాకు, సకలశుభదాయీ = సమస్త శుభఫలంబులనిచ్చువాడు, భవతు = అగుగాక.

దుష్టశిక్షణను, సాధురక్షణను జేయుటకై భూమి యందు రాముడై యవతరించిన వైకుంఠవాసి నాకు సకలశుభముల నిచ్చుగాక యని తాత్పర్యము.

జగత్కర్తాధాతాతదుపచయకారీమురరిపుః
శివస్సంహర్తేతిప్రతిదిశముశన్తిస్మవిబుధాః
తదేషాంవైదగ్ధ్యంయదమలవిలాసైకశరణం
స్వవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే 12

అర్థము :—ధాతా = బ్రహ్మ, జగత్కర్తా = చరాచరమయంబగునీప్రపంచమునెల్ల సృజించువాడనియు, మురరిపుః = ఈబ్రహ్మసృష్టిలో తనదుష్టస్వభావముచే మిక్కుటముగుబాధలు గలుగజేసి యందలిప్రజలనెల్ల వస్వస్థులనుజేయు మురాసురుని సంహరించి జగత్తున కుపకార మొనరించిన శ్రీ విష్ణుమూర్తి, తదుపచయకారీ = సృజింపబడిన యాప్రపంచమునొక్క పోషణరక్షణములను జేయువాడనియు, శివః = ఈశ్వరుడు, సంహర్తేతి = కల్పాంతమునం దీప్రపంచమునెల్ల నశింపజేయువాడనియు, విబుధాః = విశేషజ్ఞులగు పండితులు, ప్రతిదిశః = అన్నిదిక్కులయందు ( అంతటను )

ఉశంతి = చెప్పుచున్నారు. (పండితులందరు బ్రహ్మ, విష్ణు మహేశ్వరు లీప్రపంచముయొక్క సృష్టిస్థితిలయంబులను జేయుచున్నటుల నంతటను చెప్పుచున్నారనిభావము.) ఏషాం = ఈబ్రహ్మ, విష్ణు మహేశ్వరులయొక్క, తద్వ్యవస్థ్యం = ఆప్రపంచమును నిర్మించుటయందు, నిర్మించినదానిని రక్షించుటయందు, పిదప దానిని సంహరించుటయందు గలనేర్పు, యదమలవిలాసైకశరణం, యత్ = విరాడ్రూపుండును, పురాణపురుషుండును నగు యేభగవంతునియొక్క, అమల = స్వచ్ఛమైన, విలాస = వేడుకలే, ఏక = ముఖ్యమైన, శరణం = ఆధారముగాగలదో, (సర్వవ్యాపకుండును, సర్వాంతర్యామియు నగుభగవంతుడు, నిర్గుణుండును నిష్క్రియుండునయ్యు వేడుకచే మాయాసంబంధమున త్రిగుణాత్మకుడై, సాత్విక రాజస తామసమూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరోపాధులజేరి యాయాకార్యములజేసి వినోదించుచున్నాడని భావము.) వైకుంఠస్థాయీ = ఎల్లపుడు వైకుంఠంబుననివసించెడి, సః = ఆభగవంతుడు, మే = నాకు సకలశుభదాయీ = సమస్తశుభంబులనిచ్చువాడు, భవతు = అగుగాక.

స్వయముగా తాను, నిర్గుణుడును, నిర్వికారుడును పరమపూతుండునయ్యు కౌతూహలంబుచే మాయాగుణబద్ధుడై సృష్ట్యాదికములజేసి యానందించుచు వైకుంఠంబున ను

న్న భగవంతుడు సమస్తశుభంబుల నిచ్చుగాత యని తాత్పర్యము.

మునీంద్రాస్సౌందర్యంకుశికతనయాద్యారఘుపతే
రతింవ్రవుర్దృష్ట్వాస్త్రియఇవవిలజ్జాఃస్మరవశాః
తదిచ్ఛాసంపూర్తింయదుపతిభవేయస్సమకరోత్
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే. 13

అర్థము :—కుశికతనయాద్యాః = దేహ బలాధాయకమై కామాదికముల వృద్ధినొందించు భక్ష్యభోజ్యాది రుచ్యాహారంబులవిడనాడి తపంబున కంతరాయంబురాకుండ ప్రాణధారణముకొరకు సాత్వికాహారములనదగు గాలి, నీరు, ఆకు, అలము మున్నగునవి తిని యింద్రియముల వశపరచుకొని తపంబొనరించు విశ్వామిత్రుడు మొదలగు, మునీంద్రాః = వేదశాస్త్రరహస్యంబులెరింగిన మునిశ్రేష్ఠులు, రఘుపతేః = శ్రీరామమూర్తి వారియొక్క, సౌందర్యం = బాహ్యాలంకారములచే యలంకరింపబడకున్నను యలంకరింపబడినదానివలె బ్రకాశించెడు దేహకాంతిని, దృష్ట్వా = మిక్కుటమగు ప్రేమతో జూచి, స్త్రియఇవ = తాము మగవాండ్రైనను ఆడవారివలె, స్మరవశాః = కుసుమబాణునికి లోబడినవారై సామాన్యముగా స్త్రీలు సుందరాంగుడైత్రి భువనమోహనీయు డగుపురుషునిజూచి వానియందుదగి లిన

మనంబును త్రిప్పలేక యెట్టులనైన వాని రతింగోరి మదన బాధనొందుట సహజమైయుండ నీమునులు వీనిసౌందర్యాతిశయమునుజూచి విడువలేక స్త్రీలవలె వానిరతింగోరి గామమోహితులై బలుబాముల నొందుచున్నారని భావము. విలజ్జాః = సిగ్గులేక మొగమాటమును విడిచినవారై ( దీనిచే ప్రియవిరహావశంబున గలిగెడు దశావస్థలలో నేడవదగు హ్రీత్యాగము సూచింపబడినది.) రతిం = శ్రీరామునిసంభోగమును, వవ్రుః = కోరుకొనిరి. ( సాధారణముగా నీలోకములో స్త్రీలు పురుషులను, పురుషులు స్త్రీలను వరించితదలాభంబున విరహవేదనల ననుభవించుట నియతమైయుండ పురుషులు, అందులో వృద్ధులు, అందులో సాత్వికాహారులగుతాపసులు వీనిసౌందర్యమునుజూచినంతనే మోహించి తమతమతపంబులవిడనాడి స్త్రీలవలె వాని సంభోగముగోరి మదనబాధను లోనైయున్నారని జెప్పుటచే వానిదేహకాంతి సకల జగన్మోహనమైయున్నదను నంశము సూచింపబడినది. పిదప యః = ఏభగవంతుడు, తదిచ్ఛాసంపూర్త్యై = ఆతాపసోత్తము లగువిశ్వామిత్రాదులయొక్క వాంఛాపూర్తిని (అనగా వారికోరికనెరవేరునటుల యదుపతిభవే = యదుపుత్రుడై జనించునపుడు, కృష్ణావతారములో సమకరోత్ = చేసెనో, అనగా విశ్వామిత్రాదిమునులు సత్యభామాదిరూపములదాల్చి కృష్ణరూపు డగుభగవంతునితో రతిసుఖంబునంది కృతకృత్యులైరని భావము. వైకుంఠస్థాయీ =

ఎల్లప్పుడు వైకుంఠంబున నుండెడు, సః = అట్టి భగవంతుడు, మే = నాకు, సకలశుభదాయీ = సమస్తశుభంబుల నిచ్చువాడు, భవతు = అగుగాక.

తనభక్తు లెట్టికోరికలుకోరినను భక్తపరాయణుడై నెరవేర్చు నపరిమేయ మహిమాఢ్యు డగుభగవంతుడు సమస్తశుభంబుల నిచ్చుగాత యని తాత్పర్యము.

ప్రధానేకుర్వాణేసకలమపిసృష్ట్యాదికమిదం
ధర్మాశంఖాంభోదాత్ ప్రపదనజుషాంభక్తవిదుషాం
స్వయంయస్త్రేభ్యోదాదమృతపదమువ్వేలసుఖదం
సవైకుంఠస్థాయీసకలశుభదాయీభవతుమే 14

అర్థము:—ఇదం = మన ఇంద్రియగోచరమగునీ, సృష్ట్యాదికం = ప్రపంచనిర్మాణము మొదలుగాగల, సకలమపి = అంతయునిన్ని, ప్రధానే = ప్రధానాదికమునుండి కల్గుటవల్ల వికృతులును, కొన్నిటికి కారణములగుటచే ప్రకృతులునై ప్రకృతివికృతులని వ్యవహరింపబడు మహదాదితత్త్వముల కెంటికిని, వీటికార్యము లగుపదునారువికృతులకును ముఖ్యప్రకృతియగుటచే ప్రధానమని వ్యవహరింపబడుచున్న సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ యగుప్రకృతి, కుర్వా

ణే = చేయుచుండగా, భక్తవిదుషాం = ఆసృష్టిలోనుండు భక్తాగ్రేసరు లగుపండితులు, ప్రపదనజుషాం = (అనాదియగు జననమరణరూపమగు నీసంసారపంకంబున చిక్కుకొని తప్పించుకొని దరిచేరుట కేయుపాయముగానక ఖిన్నులై తుదకు ఓయార్తత్రాణపరాయణా! అశరణశరణా! భక్తవత్సలా! దేవా! నేనీ సంసారపంకమున మునిగి యొడ్డు చేరుట కేగతికానక నీవేగతియని ప్రపత్తితో విన్న శరణుపొందితిని. నేను నీభక్తుండను. అతిదీనుడను, నన్నీపంకమునుండి యుద్ధరించి, నీదరిజేర్చుకొమ్మని ముమ్మాటికి ప్రపత్తిపరవశులైయుండగా జూచి, మోదాత్ = (భక్తరక్షణవ్రతుండనగు నాకు వ్రతముపాలించుటకు తగినసమయమువచ్చినదనిగాని, లేక సృష్టిస్థితిలయములుసత్వరజస్తమోగుణముల సామ్యావస్థయగు ప్రధానముయొక్క కార్యములైయుండగ నిర్లిప్తుండనై దీనితో నేసంబంధమును లేకయుండు నన్ను రక్షింపుమని నే నేపనిజేయుటన్నను కర్తృత్వము నాయందుంచి ప్రపన్నులగుచున్నారనిగాని యుత్సాహాతిశయముతో, శంఖం = తనహస్తమునం దెల్లపుడుప్రకాశించెడు శంఖమును, ధమత్ = పూరించుచు, (ఇక్కడ నొకసార్వభౌమునియొద్దనుండుప్రధానులు, రాచకార్యములందుగాని, యితర మృగయాదివ్యవహారములయందుగాని తమ శక్తివంచనలేకుండ శ్రమలకోర్చి బలుబాములుపడి నెరవేర్పబడినకార్యములు వాటివిషయమై ప్రభువుచేయి కలుగజే

సికోపన్నము, తత్కృతములైయున్నటుల వ్యవహరింపబడి యాతనికి మిక్కుటమగు మోదమును, ఖ్యాతిని, కలుగజే యుననునంశము సూచింపబడినది. యః = ఏభగవంతుడు, ఉద్వేలసుఖదం, ఉద్వేల = హద్దుమించిన, (మితిలేని) సుఖ దం = సుఖమును కలుగజేసెడు, (లౌకికసుఖంబులు, య త్కించిత్ కారణపురస్కృతములైయుండుటచే కారణము న్నపుడు సుఖముకల్గును, లేనపుడు సుఖముండదు. అందు చే లౌకికసుఖంబులకు దేశకాలపరిమాణముండును. అలౌకి కసుఖము హేత్వంతర సన్నిధానానపేక్షితమగుటచే దేశ కాలపరిమితి లేనిదనిభావము. అమృతపదం = మోక్షస్థానము ను, తేభ్యః = ఆభక్తులకు, స్వయం = తానే, అదాత్ = యి చ్చెనో, వైకుంఠస్థాయీ = ఎల్లపుడు వైకుంఠముననుండు, సః = ఆభగవంతుడు, మే = నాకు, సకలశుభదాయీ = స మస్తసుఖంబుల నిచ్చువాడు, భవతు = అగుగాత.

నిర్లిప్తుండును, పురాణపురుషుండును నగుభగవంతు డు ఇంద్రజాలమువలెనున్న మాయానిర్మితమగు నీప్రపంచ మునొక్కకతిజూచి మోదమందుచు ప్రపన్నులగుభక్తు లను శాశ్వతసుఖము నొందించుచునాడన్ని తాత్పర్యము.

మఘోనఃపాషాణప్రబలతరవృష్టిప్రశమనం
విధాతుంయఃకృష్ణఃస్వకరధృతగోవర్ధనగిరిః

గవాంగోపాలానామమితవిపదామస్త్రమకరో
త్స వైకుంఠస్థాయీ సకలశుభదాయీ భవతు మే॥

అర్థము :—యఃకృష్ణః = పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ అను గీతావాక్యమనుసరించి, కంసాదిదుష్టదమనము మొదలగుకార్యముల నిర్వర్తించుటకై కృష్ణరూపమున వసుదేవునకు దేవకియందుద్భవించి, మధురాపురము నేలు తనమేనమామ యగుకంసుడు “ నీచెల్లెలగుదేవకీదేవిగర్భమునం దవతరించిన శ్రీకృష్ణునివల్ల నీవు చచ్చెదవు ” అను నాకాశవాణి విని పుట్టునపుడే వానిని చంపవలెనని తగిన యత్నము చేసినను యోగమాయాసహాయమున తప్పించుకొని వ్రేపల్లెలో నందునిభార్య యగుయశోదయొద్దజేరి పెరిగి సకల దురిత ధ్వంసమొనరించుటచే సార్థక మగుకృష్ణనామమందిన యేమహావిష్ణువు, మఘోనః = తానుసరించిన నూరుజన్మంబుల సుకృతఫలంబగు దేవరాజ్యాధిపత్యమంది సకల విబుధేంద్రుల కిరీటములయందలి హీరమణికాంతులచే నీరాజితములయిన పాదపద్మములుగల యింద్రునియొక్క, పాషాణప్రబలతరవృష్టిపరిశమనం (శ్రీకృష్ణుని దుర్బోధలచే యాగమునుమాని భూతతృప్తితో సంతసించెడి గోపాలురపై కిన్కవహించి, యాగోపాలురను, వారిగోవులను నిశ్శేషముగా హింసించు నుద్దేశముతో సృజింపబడిన) పాషా

ణ = రాళ్లయొక్క, ప్రబలతరవృష్టి = మిక్కిలి కట్టియైన వి
స్తారమైన నగవర్షముయొక్క, పరిహారం = పాపుటకు, (బా
ధలేకుండుటకు) విధాతుం = చేయుటకు, స్వకరధృతగో
వర్ధనగిరిః = భక్తపారవశ్యమువల్ల నింత గొప్పకొండనైన నె
త్తుటలో సులభమైన శ్రమయని తలంచక సునాయాసముగా ఛ
త్రమువలె) స్వకర = తనచేతితో, ధృత = మీదకెత్తబడిన,
గోవర్ధనగిరిః = గోవర్ధనపర్వతముగలవాడై, గవాం = గోవుల
యొక్కయు, గోపాలానాం = ఆయావులను గాచెడు గోపా
లురయొక్కయు, అమితవిపదాం = రాళ్లదెబ్బలవల్లసంభవిం
చు లెక్కలేని యాపదలకు, అంతం = ఛత్రమువలె యీ
కొండను మీదకెత్తి దానిక్రింద గోవులను గోపాలురనునిల్పి
వర్షబిందువులు వారిపై బడకుండజేయుటచే) నాశమును,
అకరోత్ = చేసెనో, పూర్వము గోపాలు రందరుగలసి
యింద్రయాగము జేయుచుండ శ్రీకృష్ణుడు వారినందరబిలిచి
దాన నేమియు ఫలితములేదు. భూతతృప్తి దానికన్న న
త్తమంబగునదియని తగురీతిని బోధించి వారిచే మాన్పింప
నింద్రుడు వారిపై కినుకవహించి గోపాలురను వారిగోవు
లను వారి కట్టిడులొప్పుధలుచేసినవారికిని యుపద్రవముగలు
గుటకు శిలావర్షమును గురిపింపగా తాను గోవర్ధనపర్వత
మునెత్తి గొడుగుగాపట్టి దానిక్రింద నచటనున్న గోవులను,
గోపాలురను నిలిపి రక్షించెను. పిదప యింద్రుడు శ్రీకృ
ష్ణుని పరిభావమెరిగి వానితో సఖ్యపడి వానిని గోవుల కధ

పతిగాచేసెను. అందువలననే శ్రీకృష్ణునకు గోవిందుడనియు, సామాన్యమగుపర్వతమునకు గోవర్ధనమనియు లోకమున ప్రసిద్ధికలిగె ననుపురాణగాథ సూచింపబడినది. వైకుంఠస్థాయీ = ఎల్లప్పుడు వైకుంఠమునందుండెడు, సః = ఆభగవంతుడు, మే = నాకు, సకలశుభదాయీ = సమస్తశుభములనిచ్చువాడు, భవతు = అగుగాక.

తా. ఎన్నిశ్రమలు బడవలసివచ్చినను వాటిని సహించి తనభక్తుల కాపాడుటయే ముఖ్యవ్రతముగాగల వైకుంఠవాసి యగుమహావిష్ణువు నాకు సకలశుభంబుల నిచ్చుగాక యని తాత్పర్యము.

ఇది శ్రీవత్సగోత్రోద్భవులును, న్యాయశాస్త్రజ్ఞుల సూర్యనారాయణశాస్త్ర్యునకు ద్వితీయపుత్రులగు అక్కయాఖ్యనకు వెంకమాంబయందు జనించి కావ్యనాటకాలంకారముల పూర్ణమగు పాండిత్యమునొంది జ్యోతిష న్యాయశాస్త్ర ప్రసిద్ధ ప్రతిభాపరిష్కృతులై యొప్పు సూర్యనారాయణశాస్త్రికృతం బగు వైకుంఠశిఖరిణీపంచదశి యనునీస్తవరాజము సమాప్తము. దీని నాచంద్రతారకముగ నుండునటుల శ్రీగోపాలుడు చేయుగాక.

శ్రీ శ్రీ శ్రీ

